నందిని సిధారెడ్డి కవిత

# ఒక బాధగాడు

మంజీరా రచయితల సంఘం

**OKA BADHAGADU**
Poems by
**Nandini Sidhareddy**

Manjeera Rachayithala Sangham
15th Annual Function, Siddipeta
13th October, 2001

Cover Design
**Seela Veerraju**

Publication
**Manjeera Rachayithala Sangham**
17-112, Thoombai, Srinagar Colony,
Siddipeta - 502 103. Ph. : 08457-24877

For Copies
**Visalandhra Book House** , Bank Street, Hyd. and its branches in A.P.
**Prajashakti Book House,** Chikkadpally, Hyderabad and its branches in A.P.
**Disa Pustaka Kendram;** Chikkadpally, Hyderabad - 20.
**Navodaya Book House,** Opp. Arya Samaj Mandir, Kachiguda, Hyderabad.

Composed at
**Media Graphics,** Himayathnagar, Hyd. Ph. : 6596509

Printed at
**Charitha Graphics,** Chikkadpally, Hyd. Ph. : 7607361

Rs. **20.**

పాటకు హక్కులకు ప్రజలకు
బతుకిచ్చిన

*బెల్లి లలిత*
*పురుషోత్తమ్*
*ఆజం అలీ*

ముగ్గురి జ్ఞాపకం

అనువాదక మిత్రులకు
మంజీర
ద్వారక
విరసం
తెలంగాణ
మిత్రులందరికీ శనార్తులు

# ఆనవాలు

వొస్తాడనుకున్న చందమామ రాకపోవొచ్చు
మొగులయినట్టే అయి
వొస్తుందనుకున్న వానా రాకపోవచ్చు
పాడుతుందనుకున్న కోయిల పత్తా లేకపోవొచ్చు

హైరానా పడిపోయే మొఖంలో
సెకను సెకనుకూ మారిపోతున్న (ఫి)రంగుల్ని
అక్షరాలు ఆనవాలు పట్టలేవు

ఆత్మహత్యలో నల్లబడిన మొఖాల్లో
కకావికలం చేసే శవాల్ని కూడా ఆనవాలు పట్టలేవు
మనం మనుషుల కోసం కలవరిస్తాం గదా
ఇంటర్‌నెట్ వెబ్‌సైట్ దగ్గర
మనిషికీ కంప్యూటర్‌కీ ఆనవాలు పట్టగలమా....

ఇంక మాట్లాడెతందుకేమ్మిగిలిందనీ...
అరిసెతందుకూ అగ్గులు చిమ్మెతందుకూ ఏం మిగిలింది ?
అవసరమైనప్పుడల్లా
లాకర్‌లోంచి ఒక శవం తీసి
లెక్కలు చేసుకోవాలి
లెక్కలు చూసుకోవాలి
అంతా లెక్కలు !
ఇప్పటికి లెక్కలు తప్ప ఏం మిగిలినయి ?

తప్పకుండా జేబులో క్యాలిక్యులేటర్ తప్పదు

ఎప్పుడే అవసరమొస్తుందో
ఒక శవానికయినా ప్రణాళిక సిద్ధంగా ఉంచుకోవాలి

వొస్తుందనుకున్న వీసా రాకపోవొచ్చు
పెరుగుతుందనుకున్న సెన్సెక్స్ పెరగకపోవొచ్చు
పండుతుందనుకున్న పత్తి ప్రాణాలు తోడొచ్చు
హైరానా పడిపోతున్న మొఖంలో
కదిలిపోతున్న జీవకళను
అక్షరాలు ఆనవాలు పట్టలేవు

అప్ప మెడకు చుట్టుకొని ఉబ్బిపోయిన కనుపాపల్ని
ఏ డిటెక్టర్ ఆనవాలు పట్టలేదు
రవిగాంచని చోటు గాంచే కవిగూడా
ఎక్కడ శవం పొంచి ఉందో గుర్తుపట్టలేడు
అంతా సొంతం
అంతా వ్యూహం
అంతా గణితం
గుంపులో గోవిందా అంటూనే గుడిలో నగలు మాయం

అంతా ప్రచారమాయ
అంతా మీడియా
సామూహిక స్వీయ ప్రపంచీకరణలో ఏ ఆక్రోశానికీ రెస్పాన్సుండదు
అభివృద్ధి చెందిన నాగరికతలో పనీపాటా సంబంధం తెగిపోతుంది
డిజిటల్ సౌండ్ సిస్టమ్‌లో
శరీరాలకు తప్ప ఆత్మలకు కదలికలుండవ్

మాటల అవసరం మారిపోతుంది
మాటల ప్రయోజనం
బతుకు ప్రయోజనం
ఇంటర్‌నెట్ ప్రవాహంలో కొట్టుకపోతయి
స్వరం లేదు
సయోధ్య లేదు
సంఘర్షణ లేదు



కన్నీళ్ళు వేస్ట్
కవిత్వం వేస్ట్
హైరానా పడే మనిషి వేస్ట్

వొస్తుందనుకున్న వాన రాదు గనక
వానలో తడువాల్సిన పనీ ఉండదు
మన ఊహాచిత్రాలకన్నా కంప్యూటర్ చిత్రాలు
కడు తమాషగా ఉంటయి

ఇక కవిత్వంతో అక్కర్లేదు
ఎల్‌నినా మంటలకు కోయిల మాడిపోయింది
ఇక కోయిలా పాడదు
వశమయ్యే ఉన్నాం గనుక పరవశాలు ఉండవు
మాట్లాడేతందుకేమీ లేదు గనుక బతుకుడే
వొచ్చినా రాకపోయినా లెక్కలై బతుకుడే

ఎవరొచ్చినా రాకపోయినా లాభమొస్తే చాలు
మనిషి మరణించినా నష్టపరిహారమొస్తే చాలు
తుమ్మెదల మీదా తూనీగల మీదా ఇంకేం రాస్తవ్
చేతివేళ్ళ సందున శవాన్ని ఇరికించుకొని
ప్రోగ్రామ్స్ రాసుకో
సుఖపడిపోతావ్ !

*   *   *

తెగిపోయిన ఆశల్ని పేనుకుంటూ
సన్నటి గాలిపాయలా
ఒక గుంపు ఒంటరిగా నడిచిపోతుంది
వానరానీ రాకపోనీ
ఆ గుంపు ఆరాటంగా వీధులన్నీ తిరుగుతుంది
ఎవరొచ్చినా రాకపోయినా కిరీటాలూ సుఖాలూ వొదిలి
పాటల ప్రకంపనాలు చల్లుకుంటూ
ఆ గుంపు సాగిపోతుంది
తిరిగి చూసేసరికి గుంపులు - గుంపులు
పెద్ద జాతర

అక్టోబర్ 1998

# వాన పడని నేల మీద

వానపడని నేల మీద
వలపన్నటం సులువని తేలింది
మైకంలో జోగుతున్న సిమెంటు రోడ్డు మీద
చినుకులు పడినా ఎంతసేపు ?
యూజ్ అండ్ త్రో గ్లాసులు
కూడలిలో కుప్పబడి
ఇప్పటికీ ఎక్కిరిస్తనే ఉంటయ్

సూర్యుడు రాకముందే
బట్టర్ ఫ్లైలైట్లకు భ్రాంతిపడి
పూలు విచ్చుకుంటయి
పూలు పూలకే పోటీ
పూలు పూలనే అవమానించుకుంటయి
వాడిపోవటమనేది జీవితంలోనే లేదని
ప్లాస్టిక్ పువ్వు సిద్ధాంతం చేసి
ఫక్కున నవ్వుతుంది
తోడేలుకూ తోటమాలికీ తేడా అంతరించి
అంతా ఒక్కటిగానే వుంటుంది

వానపడని నేల మీద
కేకులు కట్ చేసుకోవటం ఒక సంకేతం

కూడలిలో పాన్‌డబ్బా పక్కన
గడ్డకట్టిన మనిషి శవానికి దిక్కులేదు



పురుగు మందు కలిసిన కుండలో
మంచినీరు తాగబోయి
మరణించిన తల్లీకొడుకుల బంధానికి దిక్కులేదు
లక్షల కరెంటుబిల్లు ఎగ్గొట్టిన యం.యల్.ఏ. రైస్‌మిల్లు ముందట
మూడువందల బిల్లు కట్టలేక ఉరేసుకున్న
రైతు ఇజ్జత్‌కు దిక్కులేదు

మందకు మంద
కొండను మోసినట్లు
చేతుల మీద చేతుల మీద కేకు మోసుకొచ్చిన దృశ్యం
రెటీనా మీద రెపరెపలాడుతుంది
తేడా అంతరించి
బాంబులు చేసిన చెయ్యీ
కేకులు కోసిన చెయ్యీ రెండూ ఒకటనే తేలుతుంది
మబ్బుల ముసుగులు తొలగిపోయి
అవకాశం గడ్డం తెల్లబడిపోతుంది
దూరంగా ఒక మేఘం ఒంటరిగా మిగిలి
రక్తమోడుతూ చూసే అమాయకపు చూపును వాళ్ళు ఎక్కిరిస్తరు
తోటను విగ్రహాలు ఎక్కిరిస్తయి
పక్షుల్ని ఫ్లైవోవర్లు ఎక్కిరిస్తయి
ఫ్లడ్‌లైట్లు ధారాళంగా కురుస్తున్న కాంతి వలయాలలో
బాటలు మారిపోవటం మరో సంకేతం
బాటసారులే బాటను ఎక్కిరిస్తరు

కార్తెలో పుట్టే ఆరిద్ర పురుగులు కూడా
కాలాన్ని నిద్రపోనివ్వనని శపథం చేస్తయి

పొలాన్ని కంప్యూటర్లు ఎక్కిరిస్తయి
వానపడని నేల మీద వలలు పన్నవచ్చు
వాగులు పారించలేరు

బ్యాంకులతో బాంబులు తయారు కావచ్చు
బాబులు తయారుకావచ్చు
బంతిపువ్వు తయారు కాదు

ముడివేసిన కాలమే
ముడివిప్పి ఛెళ్ళున చరుస్తుంది
అప్పుతో ఉరిపడి శవం చేసిన ఆర్తనాదానికి
భూమి పగిలి నీళ్ళు పొంగుతయి
కాటగలిసిన మనుషులే
వానపడని నేలమీద
ఊట పుట్టిస్తరు

7 అక్టోబర్, 1999
రాత్రి



# విజన్

చంద్రుడిలో ఇంకా ఆ నల్లటి మచ్చలేంటి ?
సిల్వర్ పెయింట్ వేయండి
ఈ కోట ఇంకా లాల్‌ఖిలా ఏమిటి ?
గోల్డ్ పెయింట్ వేయండి
తెలుపూ పసుపూ తప్ప ఇంకే రంగూ కనబడకూడదు
వెండి బంగారాలతో ఈ దేశం తులతూగాలి
దేశమంటే మనుషులు కాదు
దేశమంటే మార్కెట్
ఈ కవులు ఎప్పుడర్థం చేసుకుంటారో...

మన మార్కెట్ మనమే పెంచుకోవాలి
రోడ్లన్నీ ఇట్లా నల్లగా ఉంటే ఎట్లా ?
ప్రపంచ ప్రథమ పౌరుడు ఈ రోడ్లగుండానే పయనిస్తాడు
తెలుపూ పసుపూ గీతలయినా గీయండి
ఈ దారెంబట గుడిసెలుండకూడదు
గోడల మీద పిచ్చిపిచ్చి రాతలేంటి ?
సున్నా లేయించండి
వైట్‌హౌజ్‌లో తిరిగే ఆయనకదా
ఆయన వైట్ ఐస్‌కి బ్లాక్‌ఫేసెస్ ఇబ్బంది కలిగించవా?
బిచ్చగాళ్లందర్నీ మూయించండి
అందునా - బిచ్చగాళ్ళకీ భిక్షగాళ్ళకీ ఎప్పుడయినా పోటీ రావొచ్చు
దేవుడికి బుద్ధిలేదు కానీ,
పచ్చటి చెట్టుకు ఎర్రటి పూలు పూయిస్తాడా...

ఓ వందకోట్లు పోయినా ఫర్వాలేదు
పూలరంగు మార్చండి
దండలో ఎక్కడున్నా గర్జిస్తుంది మరి
ప్రపంచ ప్రథమపౌరుడు కదా, ఘనంగా సత్కరించాలి
వీళ్ళెవరూ వినరు కానీ
వెండితెర ఆర్టిస్టులున్నారు గదా
రాయించండి వాయించండి
ఆయన ఐసైపోవాలి
మన మార్కెట్ మనమే పెంచుకోవాలి
అందరూ అర్థం చేసుకొనే రోజును తయారుచేద్దాం
దేశమంటే మార్కెట్టని
దేశభక్తంటే సేల్స్‌మ్యాన్‌షిప్ అని ఒప్పించాలి
బుల్లితెరలు వెండితెరలు గిల్లి చెబితే బాగు !
మొదటాయనను మొదట అప్పే అడుగదల్చుకున్నాం
స్తోత్రాలు మహత్తరంగా ఉండాలి / సూపర్‌గా ఉండాలి
మర్యాదలు అద్భుతంగా ఉండాలి / మెమొరబుల్‌గా ఉండాలి
కోతకోసయినా కోట్లు తెద్దాం
ఆయనా మన మార్కెట్ చూడాలిగా

బడులల్లో పెట్టుబడుల గురించే చెప్పండి
తోకలు ఎంతకాలం కత్తిరిస్తాం
ఈసారి గొంతులే కత్తిరిద్దాం
పత్తిరైతులవో ప్రభుత్వోద్యోగులవో
ఎవరివైతే మనకేమిటి ?
మన కుర్చీలు ఛాంబర్‌లూ తప్ప
మన కార్లూ గన్‌మెన్లూ తప్ప
ప్రొటోకాల్లూ వాటర్‌కాన్లూ తప్ప
అన్నీ అమ్మేద్దాం
ఆత్మల్నీ ఆడపిల్లల్నీ అమ్మటానికైనా సిగ్గుపడకూడదు
రేటొస్తే తాజ్‌మహల్నో చార్‌మినార్నో అమ్మటానికి సిగ్గుపడకూడదు



తయారు కావాలి
తయారు చేయాలి
మార్కెట్‌కి అంతా తయారు చేయాలి
మనల్ని మనం లాభసాటిగా తయారు చేసుకోవాలి
అంతకుమించిన జీవితమేముంటుంది ?

వచ్చేవాడు అతిథి
అతిథిని దేవుడుగా భావించే దేశం కదా
సార్వభౌమత్వం పరిచయినా ఆయన్ని అలరించాలి అలంకరించాలి
రాముడి పాదధూళి సోకితే రాళ్ళు స్త్రీలయినారు గదా
క్లింటన్ పాదధూళి సోకితే రాష్ట్రాలు ఏమయినా కాకపోతయ్యా
కళకళ కోసం కాదు
కళ ప్రజలకోసం కాదు
కళ మనకోసం
మన ప్రమోషన్ కోసం
అప్పు తేవటం ఎంత గొప్ప కళ
ఆ కళలో శిక్షణ కోర్సులు పెట్టండి
అప్పులు తెచ్చయినా బతుకుదాం
ఆత్మలు అమ్మయినా బతుకుదాం
గోతులు తీసయినా
గొంతులు కోసయినా బతుకుదాం
గొప్ప విజన్‌తో బతుకుదాం
గొప్ప అప్పుల్తో బతుకుదాం
మనుషులు యుద్ధానికి దిగితే
మార్కెట్లతో ఓడిద్దాం
మనుషుల్ని మాయం చేసైనా
మనం స్వర్ణాంధ్ర సాధిద్దాం

12 మార్చి, 2000
ఉదయం

# నిర్నిద్ర

కొల్లగొట్టుడే స్వభావమైన ముఖయంత్రానికి
శరీరమయితేనేమి ? మనసయితేనేమి ?
ఊయలలో ఉంచి ఊపుతున్నప్పుడు
లోకమంతా ఊగుతున్నట్టే ఉంటది
పొందుతున్నదేమిటో
కోల్పోతున్నదేమిటో
పున్నమి చంద్రునితో ఆడి
ఏటి అలల్లోంచి ఎగిరిపడిన చేపపిల్లకు తెలియదు
ప్రపంచీకరణలో పసివాడికీ పొరునికీ అంత తేడా అనిపించదు
మారింది శరీరమా అనుభవమా అర్థం కాదు
పసివాడి నోట్లో నిప్పల్ పెడితే
మెలకువున్నంతసేపూ పాలొస్తున్నాయనే పరవశం
సబ్సిడీ పథకాలు మట్టకు రాస్తే చాలు
మందీ అదే పరవశం

మనది నిద్రో మెలకువో ఎవరు చెప్పాలె
పశు సంతతి మార్చి
పంటచేలు మార్చి
పాలలో పాలదనమంతా తరలించారు
పాల సముద్రంలో పడుకొని
భూమిని రాజకీయం చేశాడువాడు
చమురు సముద్రంలో పడుకొని
మనిషిని మహారాజకీయం చేస్తున్నాడు వీడు



అర్థాలు మార్చదలుచుకున్నవాడికి
జనం భాషేమిటి ? కావ్య భాషేమిటి ?
సున్నితమైన అనుభవాలన్నీ
డబ్బు కట్టల కింద విలవిల్లాడి మూర్ఛపోవుడు మామూలైంది
కాలికి గజ్జెకట్టి ఆడటం
పెద్ద అనుభవమేమీ కాదు
కాలికి రూపాయి బిళ్ళలు కట్టి ఆడటమే ఇప్పటి నాట్యం
చరిత్ర కాదు -
వాణిజ్య ప్రకటనలు
మనకు జీవించుడెట్లాగో నేర్పుతయి
మన పిల్లల్ని మనమెట్ల ప్రేమించాల్నో
మల్టీనేషనల్ కంపెనీలు చెబుతయి
ఆడపిల్లల్ని ఏ వయసులో ఎట్లా వేధించాల్నో
హాలివుడ్ చక్రవర్తులు చెబుతరు

మనుషుల మీది ప్రేమలు వస్తువుల మీదికి మార్చిన వాన్నేమనాలె?

ఒక్కసారిగా విషమిచ్చినందుకు సోక్రటీస్ అదృష్టవంతుడే అనుకోవాలె
ఆఫీసుల కొంత అంగట్ల కొంత
సినిమాల కొంత
విషం విదిలిస్తే చావూ ఒక్కసారి రాదు
ఆత్మహత్య నేరం కావొచ్చు
ఇంట్లో టీవీ సముద్రం నురుగుల్లో
మనల్ని మనం చంపుకోవటానికి వాయిదాల పద్ధతి నేరం కాదు
వేసవికాలం వాటర్‌ట్యాంక్ పర్రెల్లోంచి
ప్రపంచబ్యాంకు పొడవాటి బిరుదులు వాస్తుంది
మన బిందెలో నిండినవి
నీళ్ళో రసాయనాలో తేల్చుకోలేం
ఫాస్ట్‌ఫుడ్ సెంటర్లో వొట్టిపోతున్నది
దేహమో దేశమో ఎవరు గుర్తించాలె

హడావుడిగ నువ్వు నడుస్తున్నప్పుడు
నీ కాళ్ళకింది పచ్చిక నిన్ను చూసి నవ్వుతది
ప్రియురాలి మీద ప్రేమ మోసుకెళ్ళుతున్న
నీ చేతిలోని మల్లెపూల పొట్లం
నీ లెక్కలు చూసి నిట్టూరుస్తది
ఇయర్‌ఫోన్ మ్యూజిక్ కేకలకు
తప్పిపోయిన కోకిల తండ్లాడుతది
తప్పిపోయింది
కోకిలో మన అనుభవాలో అర్థం చేసుకోవటం కష్టం

తప్పిచ్చిన అనుభవాలను వెదికి పట్టుకునేతందుకు
తలకిందులైన ఆరాటాలను సవరిచ్చుకునేతందుకు
మన శరీరంలో
మనం నిద్రలేవాలె
మన గోదావరిలో
మనమే ఈదాలె



## తొవ్వలు

అడుగులు తడబడుతున్న చోట
ఆగి చూడటమే విషాదం
చిన్నప్పుడు నన్ను ముద్దాడిన తొవ్వ
నా కాళ్ళకింది నుంచి సుతారంగా జారిపోయిన తొవ్వ
భూమి భుజం మీద
తెల్లటి సెల్లాలా పరుచుకొని ముచ్చటపెట్టేది
తొవ్వకు అడ్డంగా పండుకొని
నన్ను కదులనియ్యకుండా
లాలనగా నా కాళ్ళచుట్టూ పెనవేసి సయ్యాటలాడుతూ
ఇక్కడొక వాగుండేది

వానాకాలం
జలకన్య వామహస్తం మీద జలతారుపాయలా మెరిసేది
ఎండాకాలం
రైతు మోకాలి గాయానికి చుట్టి ఊడిన బట్టపేగులా ఊగేది
అడుగులు తడబడుతున్న చోట
ఆగి చూడటమే విషాదం

ఇక్కడొక వాగుండేది
జాజురంగు చంద్రున్ని
పరంపరం చేసి ఆరబెట్టినట్టు ఇసుకుండేది
చెయిపెట్టి
యాడతోడినా నీళ్ళూరేటియి

ఒక్కొక్క దోసిలితో కడవ నింపుకొని
మా అవ్వ మాదిగ స్త్రీలతో నడిచిపొయ్యేది
ఇసుక సల్లుకుంటా కడుక్కుంటా
పిలగాండ్లకు వేరే ఆటే ఉండేది కాదు
రెండు తెల్లకొంగలు రెపరెపలాడుకుంటా వొచ్చి
అవీ అక్కడే !

అడుగులు తడబడుతున్న చోట
ఆగిచూడటమే విషాదం
అప్పటిదాకా నాకూ తెలువది
ఇసుక బంగారమవుతుందని -
బ్యారపోల్లు ఆ వూరికొచ్చిందాక
ఆ రైతులకూ తెలువది
వాళ్ళ పంట పండి
తమపంటలెండుతాయని -

ఇసుకలారీల్లో నింపటానిక్కూడా
నీ చేతులు పనికిరావని
ప్రొక్లెయిన్‌లు నూకేసేదాకా
రైతుకు రాజ్యం అర్థం కాదు
పొలంల మొలిచిన పెద్దపొక్కల్ని చూస్తే
కండ్లల్లనన్నా నీళ్ళూరయి
కొత్తగా మొలిచిన రెండు అమెరిక చెట్లు
వాగును ఎక్కిరిస్తయి
ఇసుక లారీలు
కడచూపుకూడా చూడకుంట స్పీడు పెంచుతాయి

బతుకులు తారుమారవుతున్నచోట
తెగింపు లేకపోవటమే విషాదం !
జ్ఞాపకం జ్ఞాపకం కోసమే కాదు
బతికున్నామో లేదో చూసుకోవటానికి -



నడిసొచ్చిన తొవ్వలో
పొందిందేమిటీ ? కోల్పోయిందేమిటీ ?
మన తొవ్వకు ప్రపంచబ్యాంకు తారుపూయటమే పెద్దకుట్ర

తొవ్వలు తారుమారవుతున్నచోట
సోయిలేకపోవటమే విషాదం
తొవ్వా వాగూ తొవ్విపోసిన చోట
రైతు పొలమూ నా పాటా మొదలయితుంది
ఖచ్చితంగా నాకు తెలుసు
కడుపుమండిన రైతు
కొత్త తొవ్వ తొక్కుతడు
ఆ తొవ్వల పైనను సుతా తొక్కుతడు

1 నవంబర్ 1997,
రాత్రి

# ఎండిన చెరువు ముందు

ఊరి పానాదులన్నీ
చెరువుకట్ట దిక్కే
మబ్బుల లేచిందగ్గర్నుంచీ
చీకటి చిక్కవడిందాకా
నరసంచారమంతా అటు దిక్కే
కట్ట ఎక్కితే చాలు
కడుపు నిండిపొయ్యేది
కనుచూపు మేరా
పచ్చటిచేన్లతో
చమత్కారంగా కరచాలనం చేసేది
కథలు చెప్పేది
బర్ల మీదికెక్కి సీటిగొట్టే బరివాతల పిలగాండ్లు
లయబద్ధంగా బట్టలుతికే చాకలిపడతులు
పిట్టలుకట్టిన రాగాలూ దాగుడుమూతలూ
తడల్లో చేపల సయ్యాటలూ
ఎంతకమ్మటి ప్రపంచాన్ని కుమ్మరించేవో అప్పుడు

సులువుగా మరిచిపోతాంగానీ
మన మాటల సొగసంతా సులువుగా అబ్బిందేంకాదు
కరువుకూ కాలానికీ
మన అడుగులే తోడు
పాడుపడిన పానాది వెంట
ఎవరు మాత్రం ఎందుకు నడుస్తారు ?

మనిషిని బట్టే కాలం !

ఎండిపోయిన చెరువు ముందు నిలబడితే
చూపు పెళ్ళలు పెళ్ళలుగా విరిగిపడుతుంటది



వొర్రిపోయిన రైతులా
నెత్తికి చేతులుపెట్టి
పంటగుండు కుములుతుంటది
ఒళ్ళంతా పగుళ్ళతో
ఒండు ఒకప్రక్కకు ఒత్తిగిలుతుంది
అప్పనంగా వొచ్చిన లొట్టపీసు చెట్లు
అపహాస్యంగా నవ్వుతయి

ఎండిన చెరువు
శవం మీద కప్పిన పాత చిరుగుల దుప్పటిలా
పరచుకొని ఉంటది
మొండితుమ్మలు అల్లుకొని మొఖం గుర్తుపట్టటానికే ఉండదు
తుమ్మితే తూము ఊడిపడుతది
అలుగుమత్తడి
అంత దూరం నుంచే ఎక్కిరిస్తుంది
ఆవులించే గట్లు
శిఖం భూమి మీద శిలాశాసనాలు పూస్తయి
ఎండిన చెరువు ముందు నిలబడితే
పద్యం ఎండి పట్టున పలుగుతుంది
పిట్టలూ లెవ్వు పాటలూ లెవ్వు
బుడుంగుమనే బుడుబుంగల జాడలేదు
కిరణాలకు ఎగిసిపడే చేపపిల్లల గురుతుల్లేవు
మైసమ్మ గుడిదిక్కు మళ్లి చూసే మానవుడే లేడు
ఎండిన చెరువును చూస్తే
ఏడుపు ఎగేసుకొస్తది
ఊరందర్నీ సాదిన చెరువు
ఉనికే ఉత్తదయింది
పాడువడ్డ రాజకీయంల
పానాది పాడువడింది

ఇప్పుడు
పానాదులన్నీ
బస్టాండు దిక్కే

30 మే 2000
మధ్యాహ్నం

## బతకవోయిన బతుకు

దారుశిల్పాల్లా నిలవడ్డ
మొండితుమ్మల కింద నుంచి
రుమాలు ధరించి పూర్వీకుడెవరో
నడిచిపోతున్న అలికిడి
మేకలు మేసి పోంగ మిగిలిన కొమ్మొలె
ఎండిపోయి గలగలలాడుతున్న మనసు
నడవకేమి
ఒక సూర్యకిరణం విరిగి
చెప్పుల్లేని అరికాలుకు గుచ్చుకొని మొత్తుకుంటది
కొద్దిసేపట్ల నెత్తురూ కన్నీళ్ళూ కలెగల్సి
రుమాలు నిండా జ్ఞాపకాలు

ఇరవయేండ్ల కిందననగా పాడువడి
పెంకలు లేచి
పెండెరాలి
కూలికూలి
గడుసుగా నిలవడ్డ మొండిగోడల పక్కల
నిన్నట్నుంచి సంచరించిండు
మట్టిగప్పుకున్న చిక్కుల దువ్వెన ముక్క చూసి
ఉట్టి దిగని రంగుమారిన రిబ్బెన చూసి
కన్నీళ్ళు దాచి రోదిస్తున్న చాటపట్టె చూసి
అతను తట్టుకోగలడా...

కార్తులు కార్తులుగా
చెట్ల చేతులకు పచ్చబొట్టు పొడిచే పురాస్మృతులు



పూదిచ్చిన కూరాడుకుండ పగిలిన పాత అంచు
గుండెకు ఛిద్రం చేస్తుంది
అనుబంధాన్ని చావగొట్టి
అసహాయంగ చూసే అసమర్థత
పొగచూరిన గోడ కానుకోని
తలకిందులైన పొయ్యి
జీవితాన్ని అడ్డం పెట్టుకొని ఎక్కిరిస్తుంది

బతకవొయ్యి బావుకున్నదేమున్నది
ఒక్కపూట బువ్వకోసం
దేశదేశాలు తిరిగి దేవుకున్నదేమున్నది
ఈత తట్టకు బదులు
ఇనుపతట్ట మోసిండు
యిత్తులకు బదులు
పైసలు చూసిండు
ఈడ్సుకపోయిన చేతుల మీద మొయ్యలేక
కన్నతల్లిలాంటి పొలం రైను బెట్టిండు

తిరిగి తిరిగి తిరిగొస్తే మిగిలిందేమున్నది ?
పుచ్చిన చేరెళ్ళ మీద స్వప్నం
తెగిపోయి మొలకు వేలాడే నమ్మకం
మోసపు మెరుపులల్లుకుంటున్న
మొండిగోడల మధ్య
బతికున్నాడు ఇంకా మొండిగా
పాలోల్ల వాకిండ్లన్నీ పొక్కిల్లే
వాడంతా వలస పోయినట్టు
ఇండ్లన్నీటికి తాళాలే
ఎంత సంచరించినా
పాతమట్టి నెంత రాసుకున్నా
కంటికింది నల్లటిమచ్చలు పొవు
గుర్తుపట్టే ఒక్క ముసలవ్వకు కండ్లు కన్పించయి

ఊల్లె ఉండనియ్యరు
బయట బత్కనియ్యరు
ఇల్లిడిసి ఊరిడిసి భూమిడిసి బతకవోతే
బతుకంతా మసకబారుతనే వున్నది

కూలిన గోడల కింద
ఏం దేవులాడితే ఏముంది
ఎగేసుకొచ్చే ఏడుపు తప్ప -
తొక్కులాటలో గట్టివడ్డ గడ్డిపోచలు తప్ప
ఎవలూకుంచుతరు

మొండితుమ్మల్ల
కూలినగోడల కింద కూలబడ్డ
అతన్ని గుర్తించిందెవరు ?
నిద్రపట్టని కవి !
పాలుపడని పచ్చిబాలెంత తెలంగాణాపల్లెను చూస్తూ
ఎంతకూ నిద్రపట్టని కవి !

8 అక్టోబర్ 1999
ఉదయం



# ఇజ్జత్

కరకర పొద్దు పొడిసేటప్పుడు
ఎండపొడలో నువ్వూ నేనూ నిలబడివుంటాం
ఎండపొడ ఎవరి సొంతం కాదు
కాళ్ళకింది భూమ్మీద మనిద్దరమేనా...?
కోట్లమంది సావుకూ బతుక్కూ మధ్యల
సన్నటి తీగ మాదిరి కొట్టుకుంటున్నరు
నిల్సున్న సోట భూమ్మీద గెట్ల కోసం నీకూ నాకూ పంచాయితి
ర్యాగడిసెక్కలు ఎర్రతరకలు
సోటపర్రెలు మొరంపట్టెలు
ఒక్క భూమే ఎన్నితీర్లు
బంగారమసొంటి ర్యాగల్లల్ల
రేగడివిత్తులు చల్లి
మన వాటా మీద హక్కుభుక్తాలు రాయించుకుంటున్నరు

కరకరపొద్దు పొడిసెటప్పటికి
బాలసంత జోలె నిండేది
ఊరిని నిద్రలేపిన గంట
చాపసింపుల సందున కలవరిస్తంది
బాలసంత బాణీని ప్రేమించగలం
జోలెను ప్రేమించగలమా
పాటకూ జోలెకూ పట్టు ఉన్నది నువద్దె

కంచెలకెల్లి కరకరపొద్దు పొడిసేటప్పుడు
మోత్కు చెట్ల మొఖం మీదికెల్లి జారుతన్న ఎండపొడ
బట్టల్లేని పెయిమీద చురుక్కుమంటది

సుట్టాకు మురిపెమే -
పీకె కట్టి కీక పెట్టెతందుకు నిలువెల్ల మురిపెమే
సుట్టాకేకాదు - అది ఇస్తరాకుసుతా
దుకాండ్ల సరుకైన కట్టల మధ్యన
గుండెకు తూట్లుపడ్డ యిస్తరాకు దుఃఖం వినగలమా...

కరకర పొద్దు పొడిసేయాల్ల
పసులు మేతకు బయలెల్లినప్పుడు
లేచిన దుమ్ము కవి సమయమైంది
పసుల కొమ్ములకు పూసిన జాజు గురుతులు
పోరని వీపుమీన ఉడుకన్నం కొట్టి ఉరికించిన క్షణాలు
పరవశించి కయిగడ్తంగని
పోరన్ని వినగలమా...
రోజొచ్చే ఆవు రాలేదని కంచె కన్నీరు పెట్టుకుంటున్నది
పోరని గుండెల మీంచి పసులమందను నింపుకపోతున్న
లారీల చప్పుడు ఆపగలమా...
కోత ఫ్యాక్టరీల వద్ద కోతపెట్టే ఎముకల గుట్టలు చెప్పకపోవొచ్చు
మాంసం ముద్దలకూ నోట్లకట్టలకూ లెక్క ఉన్నది నువొద్దె

కరకర పొడిసే పొద్దటిపూట జలజలపారే నీళ్ళను చూస్తే
కవిత్వం పుడ్తది
మన భూముల మీంచి పైపులల్ల నుంచి తరలిపోతున్న
నీళ్ళ గుట్టుచప్పుడు గుండెను తాకుతుందా...
నీళ్ళను చూడంగనే
మోటసిమ్ముల మీదికెల్లి దుంకి
బాయితల్లడిల్లె తట్టు ఈత గొట్టిన మనసుపడ్తది
బాయికాడ మోటబొక్కెన సప్పుడుకు మొదలైన పాట యాదికొస్తది
బాయిలు కతమైనయి
బోర్లూ కరెంటుమీటర్లూ బతుకుచుట్టూ -
నీళ్ళకూ చాలాక్కీ బంధం నువొద్దె



దొడ్డుదొడ్డు తీగలల్ల దోచుకపోయిన అసలు కరెంటు
సన్నతీగల కరెంటు సావుకొచ్చినట్టు వొచ్చి
మోటర్ కాలినప్పుడు గుండె కాలుతది
రైతులు ఉరిపెట్టుకుంటుంటె
రాజ్యం మీద క్యాలి ఉన్నదా
రాజ్యం సొంటు మాట్లాడ్తె గరమయితది పానం
మన పాట సొగసు పాడయిపోతందని గాయిపెడ్తంగనీ
పాట ప్రాణమే అది
రాజ్యానికి మార్కెటుకూ కట్టు ఉన్నది నువ్వద్దె

కరకర పొడిసే పొద్దు ఎదురుంగ నిలబడ్డప్పుడన్నా
నిజాలు ఒప్పుకొందాం
ఎంతగాయిపెట్టినా అడ్డరిమి చేసినా
ఎండపొడ ఎవరి సొంతమూ కాదు
తాటివనం ఆవల నుంచి
పాతమట్టివాసన మోసుకొస్తున్న
గాలితెరలు ఎవల హక్కు కాదు
నేలమీదనే మన కొట్లాట
నీళ్ళ దగ్గరే మన కొట్లాట
నేల మీద నీళ్ళ మాదిరి ఒలుకుతున్న నెత్తురు దగ్గరే మన మేరుపడేది
గుంపు చింతల నుంచి గుట్టబోరు దాంకా
ఒకటొక్కటే కనుదాటుతున్నప్పుడు
పంటపొలం నుంచి వంటింట్ల దాంకా
దుకాణం చొచ్చుకొస్తున్నప్పుడు
భూమి లోపలిపొరల్లో నీళ్ళరంగు కూడా మార్చుతున్న
రాజకీయ రసాయనాలను వొదులగలమా...
అంతా పచ్చగ ఉందని కలలు కంటే అది అవొద్దం
మనిషి ఇజ్జత్ కోసం చస్తున్నప్పుడు
పాట ఇజ్జత్ కోసం కలెవడ్తది
నియ్యతున్న పాటైతే
ఇజ్జత్ కోసం నిలవడ్తది

26 నవంబర్ 2000
తెల్లారుజాము

# ముంపు

మీది కలంపోటే కావొచ్చు
మాది నోటిమాటే
ఇల్లు కూలగొట్టుకొమ్మంటే కూలగొట్టుకున్నం
ఊరిడువుమంటే ఇడిసినం
ఇడవనోల్ల ఇండ్లు మునిగిపోతయంటే గజగజ వొణికినం
డాం కడ్తున్నమని
దాం దూం లాడితే దడుల్లుమన్నం

ఊరు నీళ్లల్ల మునిగింది
మేం దుఃఖంల మునిగినం

పైసలిస్తమంటే బమిసినం
బతుకు పైరవీ అయితదనుకోలే
జాగలిస్తమంటే బమిసినం
ఆగమైతమనుకోలే
మాకంటే
చెట్టుమీది గుడ్డికొంగలు నయం
ఏ సర్కారు మాటలు పట్టుకోకుంట ఎగిరిపోయినయి
ఒక్క ఉరుముకే
అంత పెద్ద ఊరు అమాంతం సెదిరిపడ్డది
ఏ కుటుంబం ఏ ఊర్లె పడ్డదో తెలుస్తలేదు
దస్కతులొత్తివొత్తి బొటమనేలుకు సిగ్గయితంది
తిరిగి తిరిగి కాళ్ళు కులవడ్తన్నయి



కాకుల లెక్క మాది
కేసుల లెక్క వాళ్ళది
సైకిలీ మీదొచ్చిన లాయర్లు కార్లల్ల దిరుగుతుండ్రు
మాకిండ్లు కాకపోయినా పెద్దసార్లకు పెద్ద బంగ్లాల్లేస్తయి
వాళ్ళ బంగులలముందట గేటుకాడ
మా కొడుకులే కావలి కుదురుతరు

అన్ని రోగాలకు మందుంది
మనాదికి మందులేదు

ఇండ్లు పోగొట్టుకున్నం
జాగలు పోగొట్టుకున్నం
ప్రేమలు పోగొట్టుకున్నం
ఊర్లు పోగొట్టుకున్నం
సింగూరు నీళ్ళొస్తే సిరులొస్తయనుకున్నం
నీళ్ళన్నీ పట్నం తోడేస్తుంటే నిలువొస్తలేదు
వానాకాలం
డాంల నీళ్ళు నిండుతె
పాతగోడకు పదనొస్తంది
తెల్లారి లేస్తే సస్తమో బత్కుతమో భయమైతంది
ఊల్లెకు తేల్లొస్తన్నయి ఇంగిలీకాలొస్తున్నయి
బజార్లనిండా కుప్పలు కుప్పలుగ సీమలొస్తున్నయి
ప్రపంచం మీద యాడాలేదు
సీమలు పట్టి మనుషులు సచ్చిపొయిండ్రు
ఎవరికి చెప్పుకోవాలె నాయిన
రాతను కుందుమా
ఈ రాతెవడు రాసిండో

మీది కలంపోటే కావొచ్చు
కత్తికంటే బలంగా దిగుతది
మాదినోటిమాటే

లెక్కలు దియ్యండ్రి
ఎవడెంత ఎనకకేసిండో
నీళ్ళు ఊరును ముంచినయి
మీరు మమ్ముల ముంచిండ్రు

మేం భూమ్మీద ఉండంగ
మీ కాయిదాల మీద ఎందుకులేం ?
మీ పిల్లలే మీరే బతకాల్నా
మేం కాకున్నా మా పోరగాండ్లడగుతరు

మాది నోటిమాటే
ఉత్తనోటిమాటే
గాలితోపాటే
ఊర్లన్నీ కలె దిరుగుతది
ఖబర్దార్

8 జూన్ 2000
మధ్యాహ్నం



# అస్తమయం

ఆమూలన
సూర్యుడు అస్తమిస్తున్నప్పుడు
పాత తుండుగుడ్డతో చెమట తుడుచుకుంటూ రైతు
పశువులకు కసవు కోసం
ఇజ్రాయిల్ యజమాని ముందు
సిగ్గిడిసి ప్రాధేయపడతాడు
బాబూ అతను రాయలసీమ రైతు

తన భూమిలో తాను
తన చేతుల్లో తాను
తనంతల తాను
ఏదీ ముట్టటానికి వీల్లేని శాపం తనది
తన మట్టికి తాను తమిదీరా దండం పెట్టడానికి లేదు
పర్మిషన్ లేకుండా ఆ భూమిలో నడుస్తానికే కుదరదు
నిలుచుని చూడాలన్నా నీడలు భయపెడతాయి
రైతు కడుపు మీద
ఫెన్సింగ్ వైర్లు పెక్కడపెక్కడ తంతాయి
ఎవరినీ వంచన చేయలేక ఆత్మవంచన చేసుకొనిండు
రైతు ఆత్మ భూమి
ఆత్మను లీజుకిచ్చుకొని అవమానాలు గడిస్తున్నాడు

తన భూమిలో తాను కూలికి వెళ్ళటం కన్నా దుఃఖమేముంటుంది?
కూలిపని చేస్తున్నంతసేపూ నరకయాతన

పాపం ! భూమి గుసగుస ముచ్చటన్నా వినకుండా
ఏసీట్రాక్టర్లు ఎప్పుడూ రొద పెడుతుంటాయి
నాగటిదుంపా కర్రూ ఒకటినొకటి ఓదార్చుకుంటూ
'ఔట్ డేటెడ్' అయినందుకు కుమిలిపోతాయి
ఈ పొద్దు రైతే 'ఔట్ డేటెడ్' అని
బిసిటా హెసిటా కార్పొరేషన్ తీర్మానం చేస్తుంది
మేధావి మంత్రులు వేలిముద్రలేస్తారు
పనివాళ్ళే పనికిరాని వాళ్ళవుతారు

ఇజ్రాయిలీ సేద్యం కదబ్బ
పశువుల మేత కష్టం కానీ
మంత్రుల మేత సులభంగా పండిస్తారు
ట్రాక్టర్ల స్ప్రింకర్ల రోలర్ల సేద్యం కదబ్బా
ప్రజలు తినే పాతపంటలేం పండిస్తాయి
'స్టార్ పుడ్డే' పండిస్తాయి
గెర్కిన్, గ్రీన్ పెపర్, బేబికార్న్...

*  *  *

ఆకులు కప్పుకొని ఆకులు తిని బలపడ్డ భూమి
రసాయనాలతో సజీవదహనమవుతున్నది
కుప్ప(o) కాలుతుంది
భజన చేసేవాళ్ళు భజన చేస్తారు
పనిచేసేవాళ్ళు పని చేస్తారు
ఎంజాయ్ చేసేవాళ్ళు ఎంజాయ్ చేస్తారు
డెమో(ప్రాజెక్టులు
చెట్లను కూలుస్తూ గట్లను కూలుస్తూ
పనిముట్లను కూలుస్తూ
ఊరిమెడకు చుట్టుకుంటయి

ఎవర్ని శపించాలో తెలియక
శపించినా ఏమీ కాదని తెలియక



రైతు పిచ్చిచూపులు చూస్తాడు
చెల్దిగానిపల్లె చెమ్మంతా
బెసిటా కంటెయినర్లలో కదలిపోతుంది
బెసిటా జీకా బదులుకున్నయి
చెల్దిగాని పల్లేమిటి
శాంతిపురం క్రిష్ణరాజపురం ఎల్లాగరం నగిసెకుప్పం మద్దులంకలేమి
మా బందారం కూడా బావురుమంటది
పదివేలు కాదు
పదిలక్షల ఎకురాలు
పచ్చిక కూడా పలకరించదు
పేగుల రొద మీద ఫెన్సింగ్‌లే అన్నీ
పెదవి మెదిపితే ఫైరింగ్‌లే అన్నీ

నెత్తురు నెత్తురంతా ఉడుకెత్తకపోతే
ఇక మిగిలేది
ఆంధ్రప్రదేశ్ అనే అతిపెద్ద ఖాళీ కంచం

10 జూన్ 2000
సాయంత్రం

# ఒగొనీ రక్తం

ఉరి తీయడానికి అప్పుడప్పుడు
ఉరితాడు కూడా మొరాయిస్తుంది
ఎంతయినా
ఉరితాడు కూడా రైతు పేనిందే కదా

ఒగొనీ జాతియువకుల ఒంట్లో
ఇంకా రక్తం ప్రవహిస్తున్నందుకు
సనీ అబాచా సిగ్గుపడుతున్నాడు
తల్లిపాలు తాగిన మమకారం మరువలేని వాళ్ళకే
తల్లడిల్లే గుండెకోత తెలుసు
పైసలూరే కళ్ళు
పెట్రోలు బావులవుతున్న సందర్భంలో
నేలతల్లి కన్నీటి బావులెవరిక్కావాలి ?
ఒగొని వృద్ధులు
పొలాల పక్కన చేనిగట్ల మీద
రాత్రుళ్ళు కావలి పడుకొంటున్నారు
పిల్లలు.... భలే పిల్లలు
పైసలు గిరగిరా తిప్పి
కాళ్ళ సందుల్లోంచి విసిరేసే ఆటాడుతున్నారు
ఇప్పుడు పంగలకర్రతో గులేరుకట్టి
బొల్లిగద్ద వెంటపడ్డారు

రత్నాలకోసం వజ్రాలగని కోసం యుద్ధాలేమిటి ?
వర్తమాన యుద్ధాలన్నీ పెట్రోలు కోసమే



పెట్రోలు పెట్టిన మంటలకు
ప్రపంచం ఐదుముక్కలైంది
పెట్రోల్ టాంకర్లకు రెడ్‌కార్పెట్‌లు పరిచి
దేశాలు సాదరంగా స్వాగతం పలుకుతాయి

దేశంలో నదులు ప్రవహించినా ప్రవహించకపోయినా
పెట్రోలు ప్రవహిస్తే చాలు
ధరలూ దారిద్ర్యాలూ ఊపిరి పీల్చుకుంటాయి
ప్రేమకంటే
పెట్రోలు పదిలం
పంటచేల మీది ప్రేమను
పెట్రోలు పైపులు పీల్చేస్తాయి
గుండెపొరల చుట్టూ
చమురు పేరుకుంటుంది
ఆకుపచ్చమాట అర్థంపోయి
చెట్లు నల్లమొగం వేస్తాయి
కమ్ముకుంటున్న పొగమబ్బులకు
పనివాని కడుపుకొట్టటమే పనయింది

అమ్ముడుపోవటానికి చెట్టుకూడా
అప్పుడప్పుడు మొండికేస్తుంది
ఎంతయినా
చెట్టు కూడా రైతు పెంచిందే కదా

అంతటా పుప్పొడి వాసన అల్లుతున్నందుకు
పూలకు గర్వంగా ఉంది
రక్తం ఉరకలెత్తుతున్నందుకు
ఒగొని యువకులకు గర్వంగా వుంది
తోటలో తనపాట నిండిపోయినందుకు
గండుకోయిలకు గర్వంగా వుంది

సారోవివా గొంతుకు ఉరి బిగించి
సనీ అబాచా నవ్వుల పాలయ్యాడు

ఉరి తీయడానికి ఉరితాడు కూడా మొరాయిస్తుంది
సారోవివా తలెత్తి ప్రపంచమంతా గర్జిస్తుంటే
అబాచా తల తెగిపడింది

కెన్‌సారోవివా ఎనిమిది మంది ఒగొని యువకులు
జీవనదుల్లో ప్రవహించి
పంటచేలల్లో ఊగుతుంటే
ప్రకృతికి కావలి !
మనిషికి కావలి !

22 నవంబర్ 1995
తెల్లారుజాము



# స్వేదఘోష

అందమైన పూలతోట ఊసులంటే మరింత ఇష్టం కావొచ్చు
మొక్కకు పాదుతవ్వి
కొమ్మకు ఆకులైంది నేనే
పూలకు రంగురంగుల వన్నెలద్దింది నా చెమటే

బంగారు తూగుటుయ్యాల జ్ఞాపకాలే మధురమధురం కావొచ్చు
మనిషికి జీవితాన్నిచ్చి
కంటిరెప్పలకు స్వప్నాలు చుట్టింది నేనే
బంగారు ఊయల ఊహలకు రెక్కలు పొదిగింది నా చెమటే
ఆకలి ఆరాటాలకు ఆరురుచుల ఆహారభోగం అపురూపమే కావొచ్చు
భూమితో చేనులెత్తించి
గింజల్లో సత్తువ వొలికింది నేనే
పండ్లకు రుచులు చల్లి
ప్రాణానికి పరవళ్ళు నేర్పింది పనివాని చెమటే

మనసులో ఆహ్లాదం వొంపే పాటలంటే తలలు పంకిస్తామా
గొంతులో కోయిలలు పెంచి
సెలయేళ్ళు దించింది నేనే
తోలుతిత్తికి అద్భుతనాదమిచ్చిన
పలుకుల పరవశాల పులకింతలన్నీ మనిషి చెమటే

నాగలిదున్నింది
నాగరికతలు వొలికింది
భూమిల ఇనుము తీసింది

బాయిల బొగ్గు తోడింది
బంగారుముద్దలు తోడింది
యంత్రాలు తిప్పింది
శరీరానికి సౌకర్యాలు సౌందర్యాలు అమిరింది

ఇవాళ చెమటను అవమానిస్తారు
ఇవాళ పనిని అవమానిస్తారు
జ్ఞానగర్వం తలకు చుట్టుకుంటుంది
ఇంకేదీ ఎక్కదు
ఇండ్లు కూలుస్తారు
చెట్లు కూలుస్తారు
మనిషిని కూలుస్తారు
ఫ్లైఓవర్ మీద జారే లోహనేత్రానికి కూలిన దృశ్యాలు ఆననే ఆనవు

చెట్లు కూలిపోవొచ్చు
చెమట చిగురిస్తనే వుంటది
నదులు ఎండగొట్టవచ్చు
చెమట నిరంతరం ప్రవహిస్తంది
మనుషులు రాలిపోవచ్చు
చెమట పుడుతనే వుంటది

చెమట నిరంతర నిర్మాణమూ
అంతే స్థాయిలో తీవ్ర విధ్వంసమూ

24 మే 1996
సాయంత్రం



# పాటలమూట

కొంకులు కూడా
మనతోనే వొస్తయి

కాళరాత్రి
భయపడి పారిపోయిన పిట్టలు
ఆ పూట దాకా బుగులు పడుతా
మన వెనుకెనుకే వొస్తయి

కదల్లేని చెట్లూ ముళ్లపొదలూ
నోరుపడిపోయి దిగాలుగా చూస్తుంటయి
గజ్జెల చప్పుడుతో అతనూ
గంభీరస్వరంతో మనమూ –
మన అలికిడికి
శతాబ్దాల మౌనరాజ్యాలు కూలిపడతయి
దేవులాడే చూపుల కొసల కాపలా
ఈతకొట్టే ముస్లింపిల్లలు
ఇప్పటికీ కోలుకోరు
ఆ కటికచీకటి
'చంపొద్దక్కా' 'చంపొద్దన్నా' అని
మొత్తుకోని మొత్తుకోని
గాలిలో నీటిలో కలిసిపోయిన పాట
మీదపడి మీదపడి
వినపడని గొంతుతో ఒకటే దుఃఖం !
గోడుగోడున దుఃఖం !

మలినమైపోయిన కన్నీళ్ళతో
దర్గబాయి దదద్దరిల్లుతుంది
నల్లబడి పాలిపోయిన ఖిలాకింద
శిథిలాలు శిథిలాలుగా
జీవితం తొక్కులాడుతుంది

తెలంగాణ నీళ్ళు నోచని మట్టిని అలుముకొని
ఒయ్యారంగా ఆటలాడిన పాదాలు
సంచిల బయటపడి
సరసర పాకుతున్న నేను బతికిలేను
బతికిన అమ్మలక్కల నడుమ కలెదిరిగి
కడుపుల చెయిపెట్టి దేవిన
గరుకు గరుకైన లాలిత్య హస్తాలు
కాళ్ళకడ్డం పడితే
మనసు పరంపరంగా రాలిపడి
మనం బతికిలేం ?
నిదురవీడని మైకం కళ్ళలోతుల్లోకి
నిర్జీవంగా చూస్తున్న ముడితెరాలే కండ్లు

చప్పుడు కాదనుకుంటం
అంతా శబ్దం శబ్దం

పదిహేడు ముక్కలుగా
మూడు మూటలుగా
ప్రశ్నలు ప్రశ్నలుగా
లలిత ఒక కరినవ్వు నవ్వుతది
నవ్వులో భావాలు చదువలేక
మెదడు నరాలు తెగుతయి
చినుకు చినుక్కూ నొసలు చిట్లించే పోస్టుమాడర్నిస్టుల వేళాకోళపు నవ్వు
తాకట్టిడిన ఆత్మల్తో జారుతున్న తటస్థవాదుల తలపట్టిన నవ్వు
అవార్డుల కోసం ముఖాలు చేపిన లౌల్యాల మీద లౌక్యాల మీద
తటాలున పగిలిన నవ్వు



కత్తికీ నోటుకీ మధ్య తళతళలాడే పారదర్శక ప్రభుత్వాల మీద
తుపుక్కుమన్న నవ్వు

ఇప్పటికీ ఆ నవ్వు
అంతర్ధానం కాక
అర్థం కాక
గిల్టీనెస్ అక్షరాల నిండ ఆవరిస్తది

పాపను ముద్దాడి
పాటను ముద్దాడి
బతుకున అల్లాడి
లలిత ఎంత ప్రసన్నంగ నవ్వేదో...
ఇవాళ నవ్వు అర్థంకాక సిగ్గుపడుతన్నా

ఇక్కడ ముసుగులు పక్కన
అలవాటైన మాటలు పక్కన
బాటసాగని సంకేతాలు పక్కన
రాజ్యహింస మీద సవాల్
పాటల మనిషిని పాలిథిన్ సంచిగా మిగల్చిన
మార్కెట్ మాయజలతారు మీదికి మనం
ఒక అగ్గిపుల్ల ఒక కొత్తపాట

లలిత గొంతులోని తడి
మట్టిలో ఆరని రక్తపు తడి
మనలోపలి తడికి
ఒక మేల్కొలుపు ! ఒక హెచ్చరిక !

27 ఆగస్టు 1999

# వీరుల భాష

వెంటిలేటర్
ఒంటికన్ను
శత్రువును గురి చూస్తున్నట్టే ఉంటది

గదిలోకి అడుగు పెట్టగానే
నేలమీది నెత్తురుచుక్క
నిలువెత్తు మనిషై గాఢంగ కావిలిచ్చుకుంటది

రక్తస్పర్శలో
కోల్పోయిన జీవితాలు పునర్జీవిస్తయి

పైకప్పు రంధ్రాలు
రాలిన ఉనుకా పెట్రోలు
కాలిపోయిన ఇల్లూ పందిరీ
జరిగిన ఘోరాన్ని వెక్కెక్కిపడుతూ వ్యక్తం చేస్తయి

కార్మికుడి కుంటికాలు స్టీలుపట్టె
కరిగిపోయి
దుఃఖం కూడా రాదు
పిల్లాడి టిఫిన్‌బాక్స్ ముద్దముద్దయి
పుస్తకాల బ్యాగు బూడిదయి
తల్లి ఏడుపే ఏడుపు

కత్తిరించిన ఆమె చిటికెన వేలును
కట్టెల మీద పెట్టేందాకా
ఎవరూ పట్టించుకోరు



గుమిగూడిన అన్ని చూపుల్లో
గుబులు గుబులు

కవీవీరుడి గాఢాలింగనంలో
రాజ్యాలు వొణుకుతాయని
అప్పటిగ్గాని అర్థంకాదు

కవి గదంతా మూలమూలా ముట్టుకుంటడు
తెగిపడిన చిటికెనవేలును దేవులాడుకొచ్చి
ఒలికి తడి ఆరని రక్తంలో ముంచి
ఒక సంకేతం లిఖిస్తడు
అది కవులకే గాదు
వీరులందరికీ అందుతుంది

28 ఆగస్ట్ 1996
రాత్రి

# చింతలు

ప్లాట్ల పంజరాల్లో
తునకతునకలుగా బందీ అయినందుకు
భూతల్లి తల్లడిల్లుతున్నాది
పంటనిచ్చే దివ్యశక్తిని కోల్పోతున్నా గదా
తరాలుగా తన బిడ్డల సాది సవరిచ్చుకునే
మమకారం పంచలేకపోతున్నా గదా అని
దిగులుతో తల్లడిల్లుతున్నది

రిజర్వాయర్ జైళ్ళో జీవితం ఉడిగిపోతున్నందుకు
నది కన్నీళ్ళు పెట్టుకుంటున్నాది
పొలాల నాలుకలు తడపలేకపోతున్నా గదా
నాగలికర్రై బతుకంతా నడిచిన రైతు
పాదాలు ఒకసారన్నా కడగలేకపోతినిగదా అని
నది దిగులు పడుతున్నది

లారీల్లో పరాయిచోటికి తరలిపోతున్న
ఇసుకరంది పడ్తున్నాది
భవన నిర్మాణంలో రూపం మారి ఉనికి కోల్పోతున్నా గదా
ఎండలో నడిచొచ్చిన బాటసారి
సహజశయ్యనై సేదదీర్చలేకపోతున్నా గదా అని
ఇసుక గొణుక్కుంటున్నది



చింతచెట్టు గుబురుల్లో కోయిలపిట్ట చిన్నవోతున్నాది
చిగురుతినని కంఠంతో చింతిల్లుతున్నాది
ఇంతమంది మనుషులు ప్రాణాలు తీసుకుంటుంటే
ఒక్క సహచరుని పాటన్నా పాడలేకపోతున్నా గదా అని
కోయిల విలవిల్లాడుతున్నది

27 సెప్టెంబర్ 1997
రాత్రి

# ఉలిపికట్టె

పనంటేనే గిట్టదు
తాగుడొక్కటే తన్మయం
లోకం వంకరగా ఉందనీ తాగుతాడు
సంసారం సవ్యంగా లేదనీ తాగుతాడు
అప్పు పెరిగిందనీ తాగుతాడు

తాగితే లోకం చక్కబడదని తెలుసు
తత్వం పాడితే కడుపు నిండదని తెలుసు
చక్కబర్చే పనికైనా
వంకలే పెట్టటం అలవాటు

చక్కబడాలని మనసులో ఉంటే గదా
పనిలోని పనితనాన్ని
మెచ్చుకునేది



# మాటల యుద్ధం

వేలాడే కత్తి మీద
వేలకొద్ది యుద్ధాలు
మాటలతోనే అయినా
మనదీ యుద్ధమే
హక్కుల కోసం ఎత్తిన
ఉక్కుపిడికిళ్ళు ఊరేగింపులూ మనం
బతుక్కోసం నెత్తుర్లోడుతున్న
ఊపిరితిత్తుల ముఖచిత్రాలు
పల్లెపాటల ఉద్వేగాలు
మన వెన్ను తడతయ్
కొండల మీంచి లోయల్లోంచి
గాలి మోసుకొచ్చే అలజడులు
రక్తాన్ని శుభ్రపరుస్తయ్
నువ్వూ నేనూ
అందరం ఒక్క ఆకాశమై లేస్తే
పీఠాలు కంపించవూ -

హవాలా ముసుగుల్తో
హవా సృష్టించే తేనెకత్తులు మన చుట్టూ -
కాకపోతే కళ్ళలో సూదులు దించే
తడిబట్టలు మన చుట్టూ -
మనమే గొంతు విప్పకపోతే
ఇక ఆకాశంలో ఏ ఒక్క నక్షత్రమూ మిగలదు

మాట్లాడే ఏ ప్రాణీ మిగలదు
మనిషి కొరకు నిలబడటంలో
ఒక మనిషికెంత తృప్తి !
మనుషుల కొరకు యుద్ధమవటంలో
మనిషికెంత ధైర్యం !

నిజమైన మనిషి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు మనిషే
మనం ఆరాటపడాల్సింది
గాయపడ్డ మనిషి ఆత్మ కోసం
నిజంగా మనం నిలబడాల్సింది
మనిషిని ప్రేమించే ప్రపంచం కోసం

15 మే 1996
రాత్రి



# ఆరాటాలు

ఇట్లా అయిపాయె గదా అని
ఆరాటపడటం తప్ప
అంతకుమించి చేసేదేముంది ?

మైదానం గాయపడినపుడు
మనసు వికలమైంది
అంతకుమించి ఉలికిపడేదేముంది ?

వొడిలో ఆడుతూ కేరింతలు కొడుతూ
పెరిగినవాడు
నేలతల్లి స్వప్నాల్ని నరికేయటం చూస్తున్నం

రాత్రికి రాత్రి
మబ్బు ముద్దలు రాలిపడి
రైతు కనుపాపలు పాడైపోతే మౌనంగా చూస్తున్నం

కడుపంతా దేవినట్లయి
భూమాత కల్లోలపడి
ఊర్లకూర్లన్ని తలకిందులు చేస్తే
శవాలు లెక్కబెడుతూ తగలబెడుతూ ఏం చేయగలిగినం ?

ఎవడి లాభాలకోసమో
నగరం నడిబొడ్డులో విషవాయువులు చిమ్మితే ఏం చేసినం ?
శవాల్ని బూడిద చేసినట్టే
మనసును బూడిద చేసుకున్నం

అరచేతిలో ప్రాజెక్టులు చూపించి
గిరిజన హరిణాల్ని తరుముతుంటే
వింత చూస్తున్నామా
అంతకు మించి అలజడేది
కరుణామయులైతే కన్నీళ్ళు కారుస్తారు
కవులైతే పద్యాలు రాస్తారు
గాయకులైతే పాటలు పాడతారు
చిత్రకారులైతే రంగులు అద్దుతారు
ఇంతకుమించి ఎవరు చేసిందేముంది ?
ఇట్లా అయిపాయెగదా అని ఆరాటపడటం తప్ప
అంతకుమించి అడ్డుకున్నదేముంది ?
నుదుటి మీద మతముద్రనూ
మణికట్టు మీద కులసంకెలనూ ధరించి
వగరుస్తున్నామా
పురుగు మందుతో పుణ్యస్నానం చేయిస్తున్నామా
ఫోటోలూ దండలూ
మామూలు తతంగమే తప్ప
మనసెటు పోతుందో చూస్తనే ఉన్నం
కన్నీళ్ళు కూడా క్యాష్ సర్టిఫికెట్లవుతన్నాయా
సానుభూతి పరమనాటకీయమయితున్నదా
అంతా నాటకీయమైందని ఆరాటపడటం తప్ప
అంతకుమించి ఆందోళనేది !
చీకటి చీలిన క్షణం
మంటలైన జనం అల్లుకుంటారని
ఎదురుచూడటమే మిగిలింది

15 నవంబర్ 1995
తెల్లారుజాము



# కవులూ ప్రజలూ

మావిచివురులు ముసురుకోకపోయినా
కోయిలలు సందడి చేస్తయి
కవిత్వ వాతావరణానికి ఇక వసంతం అక్కర్లేదు
కష్టకాలమే కవులకూడలి
మనసు పుండయిన దినం
కాకులూ కోయిలలూ కట్టకట్టి కవిత్వం పాడతాయి
పోలీస్ డ్యూటీలో ఉన్న గుడ్లగూబ గద్దిస్తుంది
తుపాకులు పేలుతాయి
చప్పుడుకు పిట్టలన్నీ పరారవుతాయి
"కవులు కవులంటారు
కవులు ప్రజలకు ఏం చేశారు ?"
ఏమీ లేదు
కన్నీళ్ళకు తడిసిపోయారు
కష్టాలు పాటకట్టారు ఓదార్చారు
అంతకంటే కవులేమీ చేయలేదు
ఏమీ చేయలేరు
లేలేత పసివీపుల మీద లాఠీలు ఝుళిపించగలరా
నడిరాత్రి ఊరిమీద పడి
ఇళ్ళ తలుపులు బద్దలుకొట్టి
ఆడోళ్ళనవమానాలు చేయగలరా
చేతులు విరిచికట్టి
గోడకు నిల్చోబెట్టి కాల్చగలరా

కవులేం చేయగలరు గనక
ప్రజలకేం చేస్తారు
పైకప్పుకు రంధ్రాలుకొట్టి
పెట్రోలు పోసి
మనిషిని తగలబెట్టగలరా ?
కడుపునొప్పి నటించి
వైద్యం చేస్తున్న డాక్టరు తలకు
ఒక్క బుల్లెట్‌తో కృతజ్ఞత చెప్పగలరా
కొన్ని రోగాలకు బుల్లెట్‌తో వైద్యం చేయాలని
ఆ డాక్టరు ప్రాక్టీసు చేయలేనిది కవులు చేయగలరా ?
నిజమే
కవులు ప్రజలకేం చేయలేదు
స్కాములు మేయలేదు
కుంభకోణాల భుజకీర్తులు ధరించలేదు
ఆఖరుకు చౌకగా దొరికే
నాలుగు వాగ్దానాలైనా చేయలేదు

ప్రజలు ఉత్త బోలా జీవులు
కవుల్ని క్షమించారు
పాటలు కడితే పరవశించి పోయారు
శరీరమంతా ఉడికిపోయారు
ప్రేమంటే పడిచస్తారు గనక
కవుల్ని ప్రజలు ప్రేమిస్తారు

ప్రజలు పాటలు స్వంతం చేసుకున్నట్టుగానే
ఆయుధాలు స్వంతం చేసుకుంటారు
అపుడు
కవులు ప్రజలకేం చేశారో
ప్రజలే చెబుతారు

25 జూలై 1996
తెల్లారుజాము



# నెలపొడుపు

చెరువు మీది మమకారాన్ని
నువ్వు తాకలేవు
బుసబుసా పొంగుతున్న నీటి ఊటలధాటి
నీకు అంతుపట్టదు
అంతా దట్టంగా చీకటి నింపినప్పుడు
మనిషి నుండి మనిషిని వేరుచేసి
వేల నజరానాలు ప్రకటించినప్పుడు
ఒక్కసారిగా మెరిసిన మెరుపును బంధించటానికి
నీ సైన్యం చాలదు
జీపులు
నీలిరంగు వ్యాన్‌లు
ఫెన్సింగ్ పేర్చిన జైలు గోడలు
మా ప్రేమల్ని శాసించలేవు
నెలపొడుపు మీద మాకెంత మక్కువో
ఏ వూరికయినా ఎందుకంత మక్కువో
వెయ్యి జన్మలెత్తినా నీకర్థం కాదు

అడ్డగుట్టలో అతన్ని పట్టి ప్రాణంతీసి
పెంబర్తి గేటుదగ్గర పడేసి
నీ మలిన గుణం కడుక్కున్నవ్ గానీ
పుష్పాలవాగు పొంగుతున్నది మరి

అతడు శరీరంలోనే ఉన్నాడని నువ్వనుకున్నవ్‌గానీ
ఈ చెల్కమీది పచ్చికలో పచ్చదనమంతా అతనే -

పలుగురాళ్ళ తెల్లదనానికంటిన
మెరపులాంటి ఎర్రమట్టి అతనే
మెడచాపి ఆకులు మేస్తున్న
మేక నాలుక మీద అతను రంగులద్దుతున్నాడు
పొడవాటి టేకుపత్రాల అంచుల మీదికి
బుడిబుడి అక్షరాలు రాస్తున్న చీమలయాత్ర
అతని ఆరాటమే

అడ్డగుట్టలో పట్టుకున్న శరీరంలో
ఉన్నాడనే నువ్వనుకుంటావు
ఇందుప్రియాల భూముల్ల
నాగలి దున్నుతూ అతనుంటడు
పేవ్‌మెంటు మీద చిత్తు కాయిదాల సంచుల్తో
ఎవరెదురయినా అతనుంటడు
కళేబరంతో అతన్ని కాల్చాననే అనుకుంటావు
ఏ అడవిలో ఏ శబ్దం విన్నా
అతనే మెరుస్తాడు

మనిషి నుంచి మనిషిని వేరుచేసిన సాయం సంధ్యలో
విశ్వాసాలు కూలుతున్నయని నువ్వంటావు
మనుషుల విశ్వాసాలు నిశ్శబ్దంగా రహస్యంగా
నీ చుట్టే అల్లుకుంటున్నయని నీకు తెలువది
ఇంకా విషాదం
అవి అతనే అల్లుతున్నాడని నీకు అసలే తెలువది

5 సెప్టెంబర్ 1996
మధ్యాహ్నం



# చినుకు ఒక్కటే...

వాన చినుకు ఒక్కటే
భూమ్మీద అస్తిత్వాన్ని నిలుపుకోలేదు

వలస వెళ్తున్న మబ్బు
కంటికొసల్లోంచి రాలిన కన్నీటిబొట్టు
మనం గుర్తించకముందే
మట్టినబడి కనుమరుగవుతది

వేపపువ్వు ఒక్కటే రాలిపడితే
గడి ముందు ఏ అలికిడీ ఉండది

మొదట్లో కాటుపడేదాకా
బేరమైన విషయమే తెలుసుకోలేదు చెట్టు

ఇంతవరకు మనహయాంల
మనమెప్పుడూ చూడని
ఇంత పెద్ద సంత

మైకుల గోలలో
ఒంటరిచూపుల పిల్లాడి ఏడుపు
మనదాంక అందకముందే మాయపార

మూలబడిన న్యూస్‌పేపర్ చీదులో
మిత్రుని శవం
మనం పట్టించుకోక చిన్నబోతది

రోడ్డు దాటనివ్వని ట్రాఫిక్ జల్లుల్లో
నిలువెత్తు కటౌట్లు మింగే హోర్డింగుల కూడలి

ప్లెకార్డు ఒక్కటే
పెదవ్విరుపుకైనా ఆనదు
శబ్దం కాకుండా వాసన లేకుండా కన్నీళ్ళు రాలిపడుతుంటయి

చినుకులు పడతాయని ఎదురుచూస్తం
చినుకు చినుకులు కలిసి చిత్తారి వాన
వాన పెద్దదైతేనే
గట్లు కలుపుకుని భూమిని తొలచుకొని ప్రవహిస్తుంది



# బేహారి

ట్రెయిన్లో బెర్త్‌కి
సీతాకోక చిలుకల్ని అతికిస్తాడు
కొనమని రంగులన్నీ చూపిస్తాడు
నాజూగ్గా ఉన్నాయని ఎవరూ కొనరు
లాభం లేదని
తన చిలుకల్ని తాను తీసుకొని
మరో బోగిలోకి తుర్రుమంటాడు

10 ఆగస్ట్ 1996
సాయంత్రం

# మృత్కళలు

మట్టంటకుండా
మనమందరం చేతుల్దులుపుకుంటాంటే
అతను చేతుల్నిండా మట్టి పిసుకుతూ
నల్లగా ఉదయిస్తడు

మసక బారుతున్న చూపులతోనే
మట్టి జిగట పడిందో లేదో
ఇట్లే గుర్తుపడతాడు
అన్నీ సిద్ధం చేసుకొని
కట్టెపట్టి సారె తిప్పుతున్నప్పుడు
అతని హడావుడిలో ఏకాగ్రత చూడాలె
ఎక్కడికక్కడ విశ్వాసాలు రాలిపోతున్నప్పుడు
బతుకు మీదయినా
పని మీదయినా
అతనికెంత ప్రేమ -

ముసలితనం చేతులు వణికిస్తున్నా
సారెమీది మట్టికి ఆకృతిస్తున్నప్పుడు
వేళ్ళ కదలికలోని నేర్పు చూడాలె
కుండ తీసేటప్పుడు కళ్ళలో రంగులు మెరవొచ్చు
నీళ్ళద్దుతూ సన్నటి సలపతో
సరిచేస్తున్న చప్పుడులో జానపదం వొలుకొచ్చు



వాము కాలుతున్నప్పుడు
మంటల్లో మెరుస్తున్న అతను, అతని భార్య -
వాళ్ళ ముఖాల కాంతితో
ఆ వాడంతా వెలుగుతుంది
అన్నీ తయారయి అమ్ముకునే వేళకు
ఆత్మ క్షోభే మిగిలింది

పెంకులు చేసిన బతుకంతా ఉత్త పెంకాసులే మిగిల్నయి
లోహం ముందు మట్టి ఓడిపోయింది
ఫ్యాక్టరీ ముందు పనితనం మాడిపోయింది
యంత్రం ముందు మనిషి నోరు తెరిసిండు

కుప్పలు కుప్పలుగా విరిసే
రంగురంగుల భారీ సరుకుల ముందట
చేతులు చిట్లిపోతున్నది నిజం
అతని చేతుల్తో
ఎన్ని ఇళ్ళల్లో దీపాలు వెలిగించిండు
ఇప్పుడు తన దీపంత లో నూనె ఇంకిపోయింది

ఎండలో నడిసొచ్చిన ఎందరి గొంతులో
చల్లటినీళ్ళు జారినయి
ఎందరి ఇండ్లల్లో అన్నం ఉడికింది
అతని కుండలో ఇప్పుడన్నం లేదు
ఐరేండ్లతో ఎన్ని కోట్ల కొత్త దంపతులకు
బంధాలు కూర్చిండు
ఇప్పుడు ఇల్లు గడవక
ఆ పాత దంపతులిద్దరికీ ప్రతిదినం తగాదే

పనితనం నేర్పిండు గానీ
బతక నేర్వలేదు

వేళ్ళతో కొట్టిన ధ్వనిలో
కుండ పగులు కనిపెట్టిండుగానీ
బతుకు పగుళ్ళు పట్టుకోలేకపోయిండు

కాటికి దగ్గరైనప్పుడు
కాలం మోసం చేసింది
కారుణ్యం మోసం చేసింది
శరీరంలో సత్తువపోయినా
గుండెలో నమ్మిక పోలేదు
పైసల లోకాన్ని తిట్టుకుంటా
మనసు చంపుకోలేక
మళ్ళా మట్టి పిసుకుతనే ఉంటడు

14 జనవరి 1995
తెల్లారుజాము



# సజీవనం

వాళ్ళు
మాతృభాషల అందాలు
పరభాషలో వెదజల్లుతుంటరు
పిల్లాన్నెత్తుకున్న తల్లి
చిన్న జానపద వాద్యాన్ని చేత్తో వాయిస్తూ
రాని భాషలో
ఆకలిరాగం పూయిస్తంది
పట్టాల మీది లయబద్ధ శబ్దాలు దాటి
మనసుకెక్కని వాదాలు విడిచి
ఆరబోసుకున్న మళయాళీ కురుల సౌరభాలువదిలి
చూపు ఆ పిల్లాడి మీద వాలుతుంది

మనం మూడు ప్రపంచాల్ని ముడుస్తున్నప్పుడు
మూడుజీవుల ప్రపంచం నివ్వెరపరుస్తుంది

మూసిన డోర్ నానుకుని
మాసిన పిలగాడు
మెడలో ఎరుపూ నలుపూ పట్టీలు వేసుకొని
గావురాలు పోతున్న కుక్కపిల్ల
మూలకొరిగి
కళ్ళు మూసుకొని బాధల్లో సెద దీరుతున్న తండ్రి

తాను మోయలేని మూటలోంచి
పాత బొంతను తీసి
కుక్కపిల్లకప్పి పిలగాడు జోకొడుతుంటడు

బయటకు రావటానికి కుక్కపిల్ల తండ్లాడ
పిలగాడు అణగబట్ట
అదొక ఆట

వెండి బొట్టుబిళ్ళ అంటించిన మొఖాన్ని బయటకు చాపి
విజయగర్వాలు పోతుంటే చూడముచ్చట
ఏదో గుర్తొచ్చినట్టు ఆటిడిసిన పిలగాడు జాలిమొగంతో
మనముందు చెయి జాపుతడు
జేబులో దొరికిందేదో
ఇవ్వగానే పిలగాని మొఖం వెలిగిపోయిందా
పిలగాడు
చర్మల్ని శరీరాల్ని దాటుకుంటూ వెళ్ళి
రొట్టెముక్కతో టీతో ప్రత్యక్షం
చిన్నరొట్టె అయినా చుంచి
కుక్కపిల్లకు తినిపించి
తనూ తినటం -
నిద్రలోంచి తండ్రిని లేపి కొంత ముక్క నోట్లో పెడతాడు
చాయలో అద్ది పిలగాడు తింటుంటే
కుక్కపిల్ల ప్లాస్టిక్ గ్లాస్‌లో మూతి పెట్టిందా
చుర్రుమన్నది
సగం టీలో
తండ్రికి రెండు బుక్కలు
తను మూడు బుక్కలు
కొంచెం ఊదుకుంట కుక్కపిల్లకు తాగిస్తుంటే
మరిచిపోయిన టీ మాధుర్యం చుట్టేస్తుంది

మిత్రుల ముచ్చట సరే
బరదానది వయ్యారాలు సరే
నా మూగముచ్చటంతా
పిలగాడూ కుక్కపిల్లా
గ్లాసు మడిచి అవతలపడేసి



కుక్కపిల్లకు పెట్టిన ముద్దుకు
ఒక్కసారి బతుకు తీపంతా కదులుతుంది
ఆ గావురాలకు మన లాకర్ ప్రేమలు నోళ్ళు తెరుస్తయి

కుక్కపిల్లా పిల్లాడు పంచే భాష
మన నిఘంటువుల్లో ఇమడనే ఇమడదు
చెక్కిలి కద్దుకుంటూ కొద్దిసేపు
వొయ్యారంగా గిల్లుతూ కొద్దిసేపు
మూటలోని గిన్నెమీద దరువేస్తూ కొద్దిసేపు
తొడమీద పడుకోబెట్టి జోకొడుతూ కొద్దిసేపు
మనుషుల్తో ఆడినట్టే పిలగాడు ఆడతాడా
కుక్కపిల్ల గురగురమంటూ ఉరుకుతూ ఉరుముతూ
గజ్జెకట్టిన చేతిని చిన్నగా నాకుతుంది
మళ్ళా దుప్పటికప్పి వాడూ
మళ్ళీ బయటికొచ్చి అదీ
విజయహాసాలతో కేరింతలు వేస్తారు
ఆ ముచ్చట ఏ అనుభూతికీ అందక మురుస్తుంటానా
నల్లకోటు తెల్లప్యాంటుతో మీసాలాయన వొస్తాడు
గట్టిగా అరుస్తూ
పిలగాడి నెత్తిమీద కాలితో తంతాడు
నిద్రననుభవిస్తున్న తండ్రి నెత్తిమీద తంతాడు
కుక్కపిల్ల నెత్తి పడేస్తాడు
అంతే
సరసు మీద రాయిపడి
ముచ్చట మాయం
స్టేషన్ రాగానే
ముల్లెమూటతో విసరబడి
మూడు జీవుల ప్రపంచం మాయం

20 అక్టోబర్ 1999
తెల్లారుజాము

# పసిలోకంలో

ఆకుమీద నిలిచిన ఆఖరి నీటిబొట్టుతో
అదొక ఆట
చిట్టి అడుగులు జారినపుడు
నేలను ముద్దిడిన నెత్తురుచుక్క
ఎవరూ చూడకపోతే హుషారుకేం కొదువలేదు
చూశారో
ఇంక ఏడుపే

అరచేతిలో అన్నం కలిపి
నీకో ముద్దా నాకో ముద్దా తినిపించి
తాడిచెట్టు కింది నుంచి జెర్రొస్తే
తనువంతా చక్కిలిగిలే
హడావుడి పడుతున్నప్పుడే
అరుగుమీద సీతాకోకచిలుక వాలుతుంది
దాన్ని ముట్టుకోవాలని మహా ఉబలాటం
అంతే భయం
మనకైనా పాపకైనా
మనసే చిత్రం
పట్టుకోదు - వదిలిపెట్టదు
'తొన్న' చూస్తానని మారాం చేస్తది
గోడకు ఎగబాకుతూ తొండ
పోతుంది వస్తుంది
పొద్దుగూకులూ అదే ఆట
వాళ్ళమ్మ అన్నం తిన్పించినప్పుడల్లా



అవతలకీ ఇవతలకీ -
కుక్కకేసిన తర్వాతే తను తినేది
ఇంతలో దుడ్డెకోసం లాలనగా బర్రె అరుస్తది
అంబా అంటూ
ఇకంతే
దొడ్డి ముందు నుంచి కదులదు
పాలమనసులు ప్రాణుల్ని ప్రేమిస్తాయి
పెద్ద మనుసులేమో వస్తువుల్ని ప్రేమిస్తాయి
ఆటలకేం
బోలెడు
పసితనంలో పట్టిందల్లా ఆటే
పడుకునేదాకా ఆటే
పక్కింటి పాప పిస్తోలుతో వస్తది
పాప అది కావాలని మారాం -
పాపకు బొమ్మలు కొందామని షాపుకు పోతామా
మెషిన్‌గన్లూ మోటార్లూ లాంఛర్లూ -
జీవుల బొమ్మలే లెవ్వు
తడిముఖం మీద మిగిలిన నీటిబొట్టులాంటి
బాల్యాన్ని తల్చుకుంటే
మనం దూగలేం
ఫైవ్‌స్టార్‌లూ కిట్‌కాట్‌లూ
పాపనైతే ముద్దాడతాం గానీ
ముద్దుకంటిన చెమ్మలోని
రసాయనాలు కనిపెట్టగలమా
పాపనైతే ఆడిస్తాంగానీ
పాలబుగ్గల్తో ఆడుకుంటున్న
పాడవాటి బహుళకోరల్ని కనిపెట్టగలమా

ఇప్పుడు నాకు భయం పట్టుకొంది
ప్రాణభయం కన్నా పెద్ద భయం అది

6 జూన్ 2000
మధ్యాహ్నం

# కొత్తదరువు

జవాబివ్వటానికి నా శక్తి చాలదు
బర్లు కాయటంలోనే ఇగిరిపోయిన బాల్యం
భుజాల మీంచి వీపు మీదికి జారుతుంటే
పలకటానికి నాకొచ్చిన మాటలు చాలవు
మొగులు మీది వరదగూడు మోసం చెయ్యవచ్చు
భూమ్మీది నూకలు మోసం చెయ్యవచ్చు
ఏడవటానికి నాకొచ్చే కన్నీళ్ళు చాలవు

పొలం అచ్చు కట్టటానికి అలవాటైన చేతుల్తో
బూట్లు సవరించలేను
నా మోకాళ్ళకూ మో చేతులకూ అంటిన బురద తడి
నోట్లు లెక్క బెట్టటానికి చేతులకు అద్దుకునే తడితో
సరితూగగలదా ?
నాకొచ్చిన పని పాతది
పాట పాతది
చెప్పు కుట్టడంలో కుదిరిన జీవితం
కాయకాయవచ్చు
పైసలు కాయలేదు
దాని తోలువొలిచి
నా బతుకు మలిచి
నా చేతులారా వంచిన డప్పు పాతదే
చెప్పు పాతదే
నా చేతులు సుతా పాతవే
బిగుసుకున్న పిడికిలి కొత్తది చూడు



డప్పు పాతదే
దరువులెన్ని పుడతయో చూడు
చుక్కలు కంపించి
జలజలా రాలిపడ్తున్న
కొత్త దరువుల్తో నీ కాళ్ళు తడబడ్తయ్
ఆరెకత్తితో తీస్తున్నవి నా అచ్చులే
మనిద్దరివి ఒకే అచ్చులు కాదు
ఈ కంపలో నడిసెతందుకు
నా చెప్పులు నాక్కావాలి

# అసహజాలు

రాత్రంతా అదే శబ్దం
పరిచితమైన కంఠధ్వని
గదంతా కిచకిచలాడుతనే వుంటది
పట్టుకుందామని చేతులు చాస్తే
పాట బుర్రున ఎగిరిపోతది
అప్పటిదాంక గుండెల్నిండా పొంగిన ప్రేమ
చప్పున కుప్పకూలుతుంది

జీవితం కాలిన బాధ ముందు
చేతులుకాలిన బాధ
పెద్ద లెక్కలోనిది కాదు

ఎన్నివిధాల చూసినా
పోకచెక్కా అడకత్తెర
సహజంగా కనబడవు

రాత్రంతా సాగిన సుదీర్ఘ స్వప్నంలో
నెమిలి కంటనీరు పెట్టుకుంటనే వున్నది
పానం అలిసినట్లే వున్నది
మగతలో కళ్ళు నులుముకునేసరికి
చేతుల్నిండా నెమలీకలే

ఎన్ని పోలికలు సరిచేసినా
ముల్లూ అరిటాకూ
సహజంగా కనబడవు



బతుకంతా అదే యాతన

కొంగు ముడికన్నా తాడుముడి గట్టిగా పడుతుంది
కనుబొమ్మల మీద
జలతారు సునేరు మెరుపులే అద్దుకుంటయి
రెప్పల కింద
రంపపుకోత పదునెక్కుతుంది
కవిత్వం అల్లుదామని చూస్తే మాటలు వొర్లిపోతయి

ఎన్ని అనుభవాలు వడబోసినా
దుఃఖమూ శిల్పమూ నాకయితే అసహజంగా కన్పిస్తయ్

14 జనవరి 1995
తెల్లారుజాము

# రాత

చివరిస్నానం చేయించటానిక్కూడా నీళ్ళు దొరకయి
శవానికయినా అదృష్టముండాలె
ఏడవటానికెవరూ ఉండరు
రాజ్యం కాని రాజ్యం
బతకపోయిన కొడుకులు ఏ చావుచస్తున్నారో...
శవమైనందుకేడువాలో
కానందుకేడువాలో
బొంతలకెల్లి లెవ్వలేని ముసలవ్వ కర్థంకాదు
ఒక్క దినమైనా
సత్తుగిన్నెల పొద్దు పొడవది
కడుపు కాల్చటానికి దాపురించిన దొరలు
తనువు కాల్చటానికి రారు
ఊచకోత కన్నా బాంబుదాడికన్నా
కటువైన ఈ హత్యలకు కేసుల్లేవు
ఉన్నవన్నీ కఠోర నిర్ణయాలే

అంతా ఇప్పటి కిప్పుడు జరిగిందేం కాదు
జల్లెడ జల్లెడయి భూమి రోదించినప్పటి మాట
బాటిల్లల్ల బందీ అయి నీరు అల్లాడినప్పటి మాట
మనిషంతా సర్కుకై రోడ్డు మీద పర్చుకున్నప్పటి మాట
పాలకులసొల్లు పత్రికలమడతల కింద దాచినప్పటి మాట



ఏదీ ఇప్పటికప్పుడు జరిగిందేం కాదు
మబ్బులు భయపడి
పిలిచినా వినిపించుకోవు
సిరికాంచె చెట్టూ సీతాఫలం చెట్టూ
చిగిర్చటం ఆపేస్తయి
దాహంతో అల్లాడిన కాకి
తిరిగి తిరిగి ఎక్కడా కడవ కనిపించక
బోరు పంపు ముందు పానశరం పడుతుంది
ప్రేమలు ఆరిపోయిన చోట
పచ్చిక కూడా మొలువది
సాదలేక కోతకమ్మలేక
రైతు యాతన చూడలేం
మనిషికయినా పశువుకయినా రాతుండాలి

వెనుకటికి బ్రహ్మరాతే తెలుసుకోలేదు
బహుళజాతి రాతలేం తెలుస్తాయి ?

తాళాలు వేసి తరలి వెళ్ళుతున్న కుటుంబాల్ని చూసి
ఇల్లు బెంగటిల్లుతుంది
కప్పు మీంచి ఒక పెంక పగిలికింద పడుతుంది
ఖాళీ అవుతున్న వాడలు చూసి కుక్కలు కునారిల్లుతయి
తరతరాల ఆత్మీయత పుటుక్కుమన్నందుకు
ఊరు పెద్దగా మూలుగుతుంది

ఎందుకిట్లా అయిందని
ఊరు కుతకుత ఉడుకుతున్నది
ఎక్కడ మీటితే ఏది తెగుతుందో
ఏది గుంజితే ఏది కదులుతున్నదో
ఊరు ఆలోచన్ల పడ్డది

28 మే 2000
మధ్యాహ్నం